# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతియొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 15 ఏప్రియల్ '72 సంచిక 3

## విషయానుక్రమణిక



### — : హెచ్చరిక : —

ప్రశాంతినిలయమున పాత షెడ్లు ఇండ్లు, తీసివేసి, క్రొత్త షెడ్లు ఇండ్లు బ్యాంకు మొదలైన కట్టడపు పనులు చురుకుగా సాగుచున్నవిగాన, దసరా పండుగవరకు యాత్రికులకు వచ్చు భక్తులు, దర్శనావకాశములు వసతులు మొదలగు సౌకర్యములు లేక చాల యిబ్బందుల పాలగుదురని అందరికీ తెలుపవలెనది

### చందాదారులకు విజ్ఞప్తి

రసీదు నంబర్లు TC 4317 నుండి 4612 వరకు చందాదారులను రసీదులనుచూచి జూన్ '72 సంచికనుండి కట్టవలసిన క్రొత్త చందాలు (రూ॥4) ఇదివరకు పంపనియెడల, కార్యాలయమునకు మే '72 15వ తేదీలోపల చేరునట్లు పంపవలయును.

# శ్రీవారి ఢిల్లీ విజయము

[ మేనెల పత్రికలో యెక్కువ వివరములు, చిత్రములు ప్రచురింపబడును ]

మార్చి 21 : భగవానులు హైదరాబాదు నగరమునకు విజయము చేసిరి.

23 : శ్రీరామనవమి మహోత్సవము : శ్రీవారి దివ్యబోధ

25 భగవానులు ఢిల్లీ మహానగరమునకు విజయము చేసిరి. అద్భుత స్వాగతము. ప్రతిదినము ఉదయము, సాయంత్రము. శ్రీ సత్యసాయి సేవాసంఘల స్టేట్ ప్రెసిడెంటు, శ్రీ సోహన్‌లాల్‌గారి వసతిముందర విశాల షామియానాలో భజన సమావేశములు; లక్షలకొలది ప్రజలకు శ్రీవారు దర్శన భాగ్యమునొసంగుట

25 మాడర్న్ స్కూలు ఆవరణమున లక్షలాది ప్రజల మహాసభనుద్దేశించి శ్రీవారి దివ్యబోధ.

27 కమాని ఆడిటోరియం ; శ్రీవారి దివ్యసన్నిధిని ఢిల్లీ బాలవికాస్ బాలబాలికలచే మనోరంజన కార్యక్రమములు.

28 : కమాని ఆడిటోరియం శ్రీవారిదివ్యోపన్యాసము డా॥ వి. కె. గోకాక్‌గారి ఉపన్యాసము.

31 : శ్రీవారు మీరట్ నగరము (ఉత్తరప్రదేశ్) నకు విజయము చేసిరి ; లక్షలాది ప్రజల మహాసభ.

ఏప్రియల్ 1 శ్రీవారు కురుక్షేత్రము (హర్యానా రాష్ట్రము) నకు విజయము చేసిరి. అఖిల భారత సాధుసమాజము అధ్యక్షుడు శ్రీ గుల్జారిలాల్ నందా గారు సుస్వాగతము నందించిరి. లక్షలాది ప్రజల మహసభ : శ్రీవారి దివ్యబోధ.

2 : ఢిల్లీలోని గాల్ఫ్‌లింక్స్ ప్రదేశమున బ్రహ్మాండమైన మహాసభలో శ్రీవారి దివ్యోపన్యాసము. సేవాసమితి సదస్యులకు బాలవికాస్ విద్యార్థులకు. సేవాదళసభ్యులకు, శ్రీవారి దివ్యబోధ

3 : శ్రీవారు బెంగళూరు నగరమునకు విజయముచేసిరి.

5 : శ్రీవారు ప్రశాంతినిలయము చేరిరి.

8 : ప్రశాంతినిలయమున శ్రీవారి దివ్యోపన్యాసము.





# రామకథా రస వాహిని

శ్రీసత్యసాయిబాబా

## 27

కుటిల మనస్కురాలైన మందర అనేక యుక్తులు పన్ని, నిర్మల నిసార్థురాలైన కైక మనసును మాలిన్య పరచి, మహారాజుపై కక్షను సాధించుటకు తగిన రీతిగా తయారు చేసెను. ఇంతటితో కైక మనసు పూర్తిగా మార లేదను అనుమానముతో మరింత వినయ విధేయతలు ప్రదర్శించుచు చెంతకువెళ్ళి కైక పాదములచెంతకూర్చుని కంటిధారలు విడుచునటుల నటించుచు,

అమ్మా! ఈ అయోధ్యలో మనలను గౌరవించు వారెవ్వరు? నిన్ను లెక్కచేయువారెవ్వరు? ఎప్పటి

కైనను వారందరు ఒక్కటియే. నీవే పరాయిదానవు. కొన్నిదినములలో నిన్ను అయోధ్యనుండియు పంపవచ్చు. అంత పనికికూడను వారు వెనుదీయరు.

మహారాజు మహామాటకారి. మాయలమారి. నీ చెంతకు వచ్చినపుడు మాత్రమే అల్లిబిల్లిమాటలాడి అతని కార్యమును సాధించుకొని ఆవలకు పోవును. అసలు నీవు దేనియందును ప్రధానస్థానము అందుకొనలేక పోవు చుండుటలోనున్న అంతరార్థమును గుర్తించుకొనలేక పోవు చున్నావు.

అమ్మా! నీకు జ్ఞాపకముండియుండ వచ్చును. అయోధ్యారాజులు కేవలము కామరూపులేకాని ప్రేమ రూపులు కారన్న సత్యము మీ తండ్రిగారు కనిపెట్టియే ఈ వృద్ధునకు నిన్నిచ్చి వివాహముచేయుటకు ముందు అంగీకరించరైరి. తదుపరి అనేక రాయబారములు నడిపి కడకు అనేకనిబంధనలుపెట్టి గర్గఋషిగారిమాటపైనిన్నిచ్చి వివాహముచేయ నిర్ణయించిరి. అందుల కంగీకరించి వారు నిన్ను వివాహమాడిరి.

ఈనాడు ఆనిబంధనలనునీటగలిపి నిన్నుమంటగలిపి నీకొమరునికి ద్రోహముచేయతలచి ఈనాటకమాడుచున్నారు. లేకున్న భరతుడు రాజ్యమున లేనిసమయము కనిపెట్టి పర రాజులెవ్వరు యిందులో భాగము వహించుటకు వీలులేకుం డునటుల అప్పటికప్పుడు ఉట్టిపడినటుల రేపటికే పట్టా

భిషేకమునకు తగిన యేర్పాట్లు గావించుచున్నారన్న యెంతటి కుచ్ఛితపు బుద్ధియో తామే యోచించుడు. పర రాజులకు తెలిసిన, వారితోపాటు తమ తండ్రిగారునూత యిందులోపాల్గొందురు. అపుడు నిన్ను వివాహమాడు సమయమున యిచ్చిన వాగ్దానమును తమ తండ్రిగారు జ్ఞప్తికి తేవచ్చును. అందుచే యెవ్వరికీ తెలియక కార్యము పూర్తిగాముగించిన తరువాత తెలిసిననూ యెవ్వరూ యేమి చేయలేరను ఉద్దేశ్యముతో ఈ జిత్తులమారి నక్కయాటల నాడు చున్నారు.

ఈ సమయము తప్పిన నీగతి కుక్కగతికావచ్చును. కాన ఆలసించక చక్కగా యోచించి పట్టాభిషేకము జరుగకుండుటకు తగినవిధానమును విచారించుట మంచిది అని రోషమును కూరిపోయుచున్న మందర వాక్యములకు మనసిచ్చి,

మందరా! నీ మాటలు విన, ఒకదానికంటె మరొకటి పరమ సత్యముగా తెలియుచున్నది నిజముగా ఆలసించుటకు ఇది తరుణము కాదు. ఇంక యేమిచేయవలెనో దానినికూడ నీవే నిర్ణయించిన అందుకు తగిన టుల నేను దానిని క్రియారూపమునకు తెత్తును అని కైకేయి అంగీకారమును తెలుపగనే, మందర మరింత పొంగిపోయి ఇక పట్టశక్యముకాని పటుత్వముతో అమ్మా యిందుకు ఆలోచనలు వేరక్కరలేదు. కావలసిన అధా

రములు పరమ సిద్ధముగనే యున్నవి.

ఆనాడు దేవాసుర యుద్ధమున తమ సహాయమును అందుకొని మహారాజు అత్యంత ఆనందముతో తమకు రెండు వరములు కోరుకొమ్మని తెలిపెను కదా, ఆనాడు నీవు అతని వలపులకు లొంగి పలుకులను లక్ష్యపెట్టక, నా కిప్పుడెట్టి కోరికలు లేవనియు అవసరము వచ్చినపుడు కోరుకొందుననియు సెలవిచ్చితివి. అవి ఈనాడెంతయో మేలు చేయగలవు. కాన, వాటినియీనాడు కోరవచ్చును కదా! అని మంథర చాల తెలివితేటలుగా పలుకగనే,

కైక ఉలిక్కి పడినటుల తలయెత్తి, మంథరా! నీకెంత తెలివితేటలే, రూపమునకు గూనిదానవైనా, విచారణలో మహా సుందరమైన దానవు. రూపమందు అందము లోపించినా తెలివితేటలలో మహా ప్రవీణురాలుగా కనిపించుచున్నావు. ఈ రెండు వరములు ఈ సమయమున ఎట్లు కోరవలెనో దానినికూడను సూచించమని కైక తెలుపగనే,

అమ్మా! ఒకటి తమ కుమారుని యువరాజుగా చేయుమనియు, మరొకటి, రాముని రాజ్యములో నుండకుండునట్లు చేయుమనియు కోరవచ్చును. అని యోచించక అతి త్వరగా చెప్పుటచూచి కైక కొంతయాలోచనలో పడి మంథరా! కుమారునికి పట్టాభిషేకము చేయుమని కోరుటలో కొంత న్యాయము కలదు కాని రాముని

రాజ్యమునుంచి పంపమని కోరుటలో నామనసొప్పకున్నది. అది నన్నెంతగనో బాధపెట్టుచున్నది.

అని విచారముగా కూర్చున్న కైకనుచూసి మంథర మరింత వెగటుగా అమ్మా! ఈ పిరికితనమునకు యిది సమయము కాదు. అలసించిన అమృతముకూడ విష ముగామారవచ్చును. ఇందులో తప్పేమీలేదు. ఈ విధ మైన కఠినమును వహించకున్న మనకార్యము నేమాత్ర మును మనము సాధించలేము. నీ కొడుకు రాజుకావాలని యున్న నీవు రాజమాతవుకావాలనియున్న ఈరీతిగా నీవు సా ధింపుము. లేదా నేనిప్పుడే విషముతీసికొని ప్రాణమును విడు తును. బ్రతికి నీబాధలుచూడలేను. అని మహాప్రేమయుం డినటుల ప్రదర్శించి, బోరున యేడ్చెను.

అతి బాల్యమునుండి కైకనుపెంచి ఆడించి, పా డించి, పెంచిన దాదియగుటచేత, మంథరన్న కైకకు మహా యిష్టమగుటచేత, మారుమాటాడక మంధరను సమా ధానము పరచుచూ, మంథరా! నీవు బాధపడకుము. తప్పక నేను నీకానందము నందింతును. ఇపుడేమి చెయుమందువో తెలుపుమనగా,

మంథర, రాముని అరణ్యమునకు పంపుటలో నీవే మాత్రము చింతించక కోరుకొమ్మని తొందరపెట్టెను. కైక రాజనీతులు పరిపాలనా విధానములు, పసిగట్టిన దగుట

చేత అరణ్యమునకు పంపుటలో కొంతకాలమునుకూడను నిర్ణయించుట మంచిదని తలంచి,

ఆనాటి నీమములననుసరించి 12 సం॥దాటిన అనుభవముగల వానికె హక్కులు చెల్లునన్న శాసనమును గుర్తించి 14 సం॥ అరణ్యవాసము కోరిన, తదుపరి తన కుమారునికే స్థిరాధికారము యుండునని భావించి ఈ రెండు కోరికలను కోరుటకు సంసిద్ధురాలగుట గమనించి మందర,

అమ్మా ! ఇక ఆలసింపకుము. నీవు ఈరీతిగానే యుండి కోరికలు కోరుటలో మహారాజు యేమాత్రము నీకు లొంగడు. నీవు మహా క్రోధమును ప్రదర్శించి, శయ్యాగృహమును యథారీతిగా నుంచక, చెల్లాచెదరు చేసి, ఆభరణములు అటూఇటూ పారవేసి, తలను విరిబోసుకొని జీవితముపై ఆశను వదలినటుల నటించుచు క్రోధగృహమున ప్రవేశించిన, అపుడే నీకోరికలకు తగిన బలము చేకూరును. లెమ్ము. ముందు కార్యమునకు ముందంజ వేయుము.

అని నిర్బంధ పెట్టుటచేత మంథర మాటలకు లోబడి యథారీతి గావించెను. క్రోధగృహమున ప్రవేశించెను. మందర యేమియు తెలియని దానివలె తలుపులు బిగించి ద్వారము దగ్గర యేడ్చుచుండునటుల నటించుచు కూలబడెను. ఇంతలో మహారాజు కొలువు

నుండి చేయవలసిన యేర్పాట్లు అన్నియు గావించి, కౌసల్యా మందిరమునకైనను వెళ్ళక తన నిర్ణయమును మొదట కైకకు చెప్పవలంచి అతి వేగముగా కైక భవనమునకు బయలుదెరి వెళ్ళెను.

దారిలో పూర్తిగ దాసీలు యేదో విచారముగా నుండిన టుల కనుపించిరి. వీరలకు రామ పట్టాభిషేకము తెలియదు కనుక ఈ విధముగా నుండియుందురని తలంచి నేరుగా శయ్యాగృహమునకు వెళ్ళెను.

అక్కడ మహారాజు చెదరిపోయిన నగలతో, పారవేయబడిన బట్టలతో వికారమైయున్న దృశ్యమునుగాంచి ఆశ్చర్యపడి కైక కొరకై అటూఇటూ తిరిగి చూచెను. ఇంతలో దాసి వచ్చి మహారాజా! కైకేయీ దేవిగారు క్రోధగృహమున కలరని తెలుపగనే,

నిరాశా, హృదయుడై అటుదిక్కు నడచి పోయెను. కటిక చీకటిలో రోదనచేయుచు నేలపైపడియుండిన కైకను చూచి కైకా! యేమిటీ వికారము. ఇంతకోపమునకు కారణమేమి? నిన్నిట్టి స్థితికి తెప్పించిన వారెవ్వరో తెలుపుము. క్షణములో వారిని హతమార్చి వత్తును. నీకు సంతోష మిత్తును. ని మనోభీష్ట మేదియో తెలుపుము. దానిని నెఱవేర్చుటకు నేను సంసిద్ధముగా నున్నాను. నీ ఆనందమే నా ఆనందము. నీకంటే మించినది ఈ లోకమున మరొక్కటి నాకు లేదని నీకు తెలియదా!

నన్నెందుకు పరీక్షింతువు. లెమ్ము. నీ అభీష్టముచెప్పుము

అని అనేక విధముల తలనిమురుచు నేలపైపడి యుండిన కైకను ప్రశ్నించుచున్న దశరథునిచూచి కైక అతి ఆవేశముతో పండ్లు కొరుకుచూ అతని చేతిని తీసి ప్రక్కకు విసిరి చాలు మి బూటకపుమాటలు. ఇంత కాలమునమ్మి నేనీస్థితికివచ్చితిని. మీ మాటలిక నేనున మ్మను. మీరు కపట నాటకమాడుదురని నేనెన్నడు తలంచనైతిని. మిమ్ము నమ్మినందుకిదియా శిక్ష. చాలు చాలు. మీ కిష్టమైన వారి చెంతకే పొందు. మనస్సు ఒకచోట, మాటలు మరొకచోట. మనసచ్చినవారికే మాట లివ్వండి. నేనిక మీమాటలను నమ్మునట్టి పరిస్థితిలో లేను. అనవసరముగా నన్ను మరింత బాధపెట్టక వచ్చినదారిని పొందు. నేనేమైన మీకేమి ? దాసినై మరణించుటకంటె రాణినై మరణించుటే మంచిది. నేడే నా జీవితమునకు అంత్య దినము.

అని వెక్కివెక్కి యేడ్చుచున్న కైకేయి మాటలు అర్థముకాక దశరథుడు అయోమయ స్థితిలో నాశ్చర్య పడెను. అంతటితో ఊరుకొనక మరింతప్రేమతో దగ్గర కూర్చుని కైకా! ఏమిటి ఈ మాటలు. నాకు అర్థమ గుటలేదు. కపటపు మాటలుకాని, ఆటలుకాని, నాలో ఏ నాటికి లేవు. రావు. మాట, మనసు రెండు ఒకే చోట నుండునుకాని, వేరువేరుగా యుండుటకు వీలులేదు.

ఇంతకాలమైనను నన్ను నీవు అర్థము చేసికొనలేక పోవు టలోగల కారణము నాకు తెలియకున్నది. ఇంతకూ, జరిగిన దేదియో తెలుపక, అర్థములేని మాటలతో నన్ను శత్రువధ చేయకు- నీవీ విధముగా నుండుటకు కారణ మేదో తెలుపుము.

అని బ్రతిమాలెను. కాని ఫలము లేకపోయెను. కైక మాటిమాటికీ దశరథుని మాటలను ఖండించుచు అలక్ష్య పరచుచు, వెగటుగా నవ్వుచు, అతని మాటలకు విలువలేక నటించుచున్న ఆమెచేష్టలు మహారాజునకు బాధకలిగించెను. చేయునదిలేక మందరను పిలిచెను.

మందర అంతకంటె అధికమైన శబ్దము చేయుచు మహారాజా! అమ్మను కాపాడుడు, అని పాదములపై బడి బోరున యేడ్చునటుల నటించెను. మహారాజు, నిర్మలచిత్తుడగుటచేత, వారిరువురు చేయుచున్నది నటనని తలంచక, ఏదియో ప్రమాదము జరిగినదనియును, లేకున్న తన ప్రియురాలు యింతమొండిగా ప్రవర్తించదనియు, తలంచి, మందరను కారణము తెలుపుమని మరొకపర్యాయము అడుగుటచేత,

మందర, రాజా! నేనేమని తెలుపగలను? నాకు వివరములు యేమాత్రము తెలియవు, అమ్మగారి క్రోధమునకు కారణము యెవ్వరికీ తెలుపుటలేదు. ఉన్నట్టుండి శయ్యాగృహమునుండి అతివేగముగా క్రోధగృహ

మునకు వచ్చుచుండుటచూచి నేనిచ్చటికి వచ్చితిని. నేనెన్ని విధముల బ్రతిమాలినను యేమియు తెలుపుట లేదు. తమరికే తెలుపనివారు మాకు మాత్రము తెలుపుదురా! అమ్మగారు పడుచున్న బాధను మేము చూడలేక పోవుచున్నాము. అమ్మగారు యేమికాగలరో అన్న భయముచేత క్షణక్షణముకాచి, తమకై వేచియున్నాము. తమరు సమాధాన పరుపకున్న అమ్మగారు ప్రమాదస్థితికి రాగలరు. ఇప్పటికే కాలాతీతమయినది. మేమిక వెళ్ళివత్తుము. తమరే కారణము అడిగి తెలిసికొని అందుకు తగిన శాంతిని చేకూర్చ వలెనని సెలవుతీసికొని బైటకువెళ్ళెను.

మహారాజు మందర మాటలు విన్నతర్వాత మరింతగా కంగారు పడుచు కైకా, నాదగ్గర మరుగెందుకు? అని క్రిందపడిన కైక తలనుయెత్తి, మహారాజు తొడపైన ఉంచుకొని అనేక విధముల కారణమును తెలుపగోరెను.

కొంత తడవైన పిదప కైక కొంత సరుదుకొంటూ, రాజా! ఆనాడు మీరు దేవాసుర యుద్ధమున నాకొసగిన రెండు కోరికల సంగతి మరచిపోలేదు కదా! అని అడిగెను. అందుకు మహారాజు, కైకా! యింతమాత్రమునకే నీవింత బేలవయ్యేదవేల? నాప్రాణమున్నంతవరకు నీకిచ్చిన వరములు మరువను. మరువలేదు. కైక యెంత ప్రాణమో కైకకిచ్చిన వాగ్దానము అంత ప్రాణ సమానము.

( సశేషము )

# సత్యసాయి మురళి

అదిగో! అదిగో! మురళి! సత్యసాయి మురళి!
తత్తరించెడి నెమ్మది తాళజాల
ఏవి పక్షుల గమనంబు తెలియపీక
ఎడద కరగించి వడి చేరదీయుచుండె!

అదిగో! అదిగో! మురళి! సత్యసాయి మురళి!
గోచరించె బృందావన కుంజమందు
వ్రజకులాంగన లొవరించు రాచకేళి,
గొల్ల పిల్లల యల్లరి, యుల్లమలర!

అదిగో! అదిగో! మురళి! సత్యసాయి మురళి!
జగతి జంజాటనంబెల్ల సమసిపోయె
కదలి పారె నజ్ఞానాంధకార పటలి
క్రమ్మె పరతత్త్వజ్యోతినెమ్మనమున!

అదిగో! అదిగో! మురళి! సత్యసాయి మురళి!
కానరాకుండె కాలచక్ర భ్రమణము
మమత మరణించె మదిలోని మాయతొలగె
ప్రేమగంగా తరంగిణి వెల్లివిరిసె!

అదిగో? అదిగో! మురళి! సత్యసాయి మురళి!
ప్రేమతో రమ్ము రమ్మని పిలుచుచుండె
సొమ్ము గిమ్మంచు కాలము వమ్ముసేయ
అరిగెదను మురళీధరు నాశ్రయింప!

(నా॥క॥గారి కన్నడ గేయమున కనువాదము)—"నరహరి"

# ప్రపంచములోని ప్రబల శక్తి

( స్టీవర్ట్ రాబ్ )

[ "బాబా" : ఆర్నాల్డ్ షూల్మన్. "సాయిబాబా మ్యాన్ ఆఫ్ మిరకెల్స్" హవర్డ్ మర్ఫెట్ ]

ఈ రెండు పుస్తకములును వాటిని పఠించువారికి దిగ్భ్రమ కలిగించును. ఎందుకనగా, వాటిని రచయితలు కల్పించివ్రాయ లేదు. వాటిలో వివరింపబడిన దివ్యపురుషుని అద్భుతచరిత్రము పఠింపగా పఠింపగా, ప్రకృతిలోని శక్తులన్నిటినీ, సంపూర్ణముగా లోబరచుకొని యేలుచున్న ఒక దివ్యపురుషుడు ఈనాడు భారతదేశమున నిజముగానున్నాడని చదువరికి ఒక విషయము తేటతెల్లమగును.

రూపులు ఆయన ప్రకృతి నియమముల కతీతమని '' అంటారు బాబావారి భక్తులు. ఆకాశమునుంచి తినుబండారాలు, ఫొటోలు విగ్రహములు అసంఖ్యాకములుగా సృష్టింతురు ప్రపంచములో ఎక్కడ ఎవరిచేతను ప్రచురింపబడని పుస్తకముల సృష్టింతురు. ఎటువంటి తీవ్రమైన వ్యాధులనైన నయముచేయుదురు. వంట చేసి వండిన పదార్థములను అక్షయముచేసి అభివృద్ధి పరచుదురు. అదృశ్య శరీరముతో క్షణములో సుదూరప్రయాణము సలిపి. పలు చోట్లలో ప్రత్యక్ష దర్శనముల ననుగ్రహింతురు ఒకే ముహూర్తమున రెండు స్థలములలో కనబడి దర్శన స్పర్శన సంభాషణల ననుగ్రహింతురు.

వీటిని గురించి బాబావారు చెప్పేవ్యాఖ్య ఒక్కటే ; ఇవన్నియు నాలోకోత్తర శక్తులకు నిదర్శనములు. ప్రజలు యేమి కోరుదురో వాటిని వారికి అందింతును. ఎందుకనగా. వారిలో దైవవిశ్వాసము, సద్భావనలు, సత్సంప్రదాయములు, సచ్చర్యలు వృద్ధికావాలన్న, ఇదే సారము. ఇవన్నీ అడంబరములు కావు. ప్రదర్శనము నా ఉద్దేశము కాదు. భక్తులనుద్ధరించేది నాలక్ష్యము.

బాబా. జీసస్సువంటివారు, కారు. వారు అవతార పురుషులు. వారి భక్తులు, వారిని పూజించి ఆనందించువారు లెక్క లేకుండ పెరిగిపోవుచున్నారు వారి ప్రభావము పాశ్చాత్యులమీద ప్రబలమగుచున్నది అనతికాలములోనే వారు ప్రపంచమందంతటను ప్రబల శక్తిస్వరూపులుగా రూపొందగలరు.

వారు కరుణా స్వరూపులు. వారి హృదయము మృదు మధురము. కాబట్టే వారి పవిత్రమైన అంతఃకరణము స్వభావముగా జనించినది. అందుకే, శరీరము అనిత్యమని దానిని లౌకిక సుఖభోగాల సాధనకొరకు ఉపయోగింపరాదని ఉపదేశింతురు.

షూల్మన్‌గారు తమ అనుభవములను సందేశములను బాబావారితోటి తమ సంభాషణలను యథాతథంగా తమ విమర్శన ధోరణిలో అవిశ్వాసమునకు సహజమైన అనుమాన మనోభావములతో చిత్రించి యున్నారు. బాబావారు దైవస్వరూపులనే భావమును ఒప్పుకొనక వారి అద్భుతచర్యలు అమూల్యోపదేశములు అనిర్వచనీయమైన ప్రేమ, ఇవన్నీ తమ మేధాశక్తికి అందనివని అంగీకరింతురు. మానవరూపమున కనబడు యెవరినీ తాను దైవముగా నారాధించనని నిర్మొహమాటముగా షుల్మన్‌గారు అంటారు.

షూల్మన్ కంటె యెక్కువకాలము బాబావారి సాన్నిధ్యములో గడపటము వలన షావర్డ్ మర్ఫెట్‌గారి రచనలో వారిని అవతార పురుషులుగా విశ్వసించిన దృక్పథము గోచరించుచున్నది ఈ పుస్తకములో వేదాంత విషయములు పాశ్చాత్యతత్త్వశాస్త్ర సిద్ధాంతములు వీటిని ఆధారముగా పెట్టుకొని మర్ఫెట్‌గారు తమ అనుభవములను బాబావారి ఉపదేశములను పరికించి వాటిమూల్యమును నిర్ణయించు ప్రయత్నమునకు పూనుకొన్నారు.

ప్రతివ్యక్తి మోసగింపగల అమాయకుడుకాదు మర్ఫెట్‌గారు. ఆయన కాస్మేనియా ద్వీపములో జన్మించి, హోబార్ట్

యూనివర్శిటీలో విద్యనభ్యసించిన పదవీధరుడు. రెండవ మహా ప్రపంచ యుద్ధములో సైనికోద్యోగిగా పనిచేసి ఆలమిన్, ట్యూనిస్ మొదలైన రణరంగాలలో ధైర్యముగా పోరాడి కీర్తి నార్జించిన వాడు. ఆ తరువాత హిట్లర్ మహాశయుని అనుచరులను కొంతమందిని యహూదులపై రాక్షసకృత్యములు జరిపినందుకు న్యూరెంబర్గ్ న్యాయస్థానమున విచారణకు గురిచేసినపుడు బ్రిటిష్‌వార్తా పత్రికల విలేఖరుల మండలికి మర్ఫెట్ గారే నాయకుడుగా సేవచేసిరి. ఇట్టి విద్యాసంపన్నుడు అనుభవజ్ఞుడు ప్రఖ్యాత రచయిత అయిన మర్ఫెట్‌గారు బాబావారి విషయములో వ్రాసియున్న గ్రంథము గౌరవించ దగినదే!

## బృందావన్ లో శివరాత్రి

—(2)

ఒక్కొక్క నియమనిష్టకు అంతరార్థమేది అని విచారించి, తెలిసికొని ఆచరించిన, దాని ఫలితము దొరకును. కాని, ఆడంబరము కొరకు, పేరుప్రతిష్ఠలకొరకు, ధనార్జనకొరకు, పటములను పూజించటము, విగ్రహములను ప్రతిష్ఠ చేయటము, మందిరములను నిర్మించటము వ్రతములనాచరించటము. ఇవన్నీ నిరర్థకములే. వీరందరు భగవంతుణ్ణి సరిగా నర్థముచేసికొన్న వారు కాదు,

అందరిలోను తన ఆరాధన దైవమున్నాడనే విశ్వాసమును బాగా పెద్దగా నభివృద్ధి పరచ వలెను. తనలోనూ అంతర్యామిగా ఆ దైవమే యున్నాడు. తన కర్మలన్నీ అతనికే అర్పితము. అదే అతని పూజ. అను భావము ధృఢముగావలెను. అపుడు సదా జాగరణగా సదా ఉపవాసముగా జీవితము జరుగును. కష్టము, నష్టము, విచారణ, విషాదము అన్నీ పరుగై పోవును. నమ్మి చెడినవారు లోకములో లేరు, భగవత్ప్రేమను హృదయక్షేత్ర మందు నాటి పెంచితే, ఆనందమనే పంట దొరకును.

" ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి " జడమైన విగ్రహములను పూజించేదాని కన్న, సజీవ దేవతా విగ్రహములైనమానవులను సేవించటముచేత నిత్యసత్యమైన ఆత్మా నుభూతి లభించి అమితానందము చేకూరును. ఉత్తరప్రదేశ మున పరమ భక్తుడొకడు శ్రీకృష్ణుని సాక్షాత్కరించే కొరకు యెవరిని ఆరాధించాలి అని తర్కించి. భక్తపరాధీనుడైన కృష్ణుడు రాధా హృదయమున బంధింపబడి యున్నాడని తెలిసికొని రాధనే ప్రార్థించి శ్రీకృష్ణుని ఆమె దయవలన వీక్షించి తరించవలె ననే యుద్దేశముతో రాధా రాధా రాధా అంటూ నామస్మరణలో మునిగినాడు. అతని జీవితము ఆవేదనా పూరితమై భరించుకోలేని తృష్ణతో నిండిపోయినది.

అతడు నివసించు గ్రామము సమీపములోనే సరస్వతీ నది ప్రవహించుచున్నది. ఒకదినము ప్రభాతమున, ఆనదీ తీరము నందున్న రోడ్డుపై ఒక గాజులవాడు పల్లెలగుండ వచ్చుచూ తన

గాజుల విక్రయానికి ఆగ్రామమునకు వచ్చెను. ఆ నది మధ్యన ఒక పల్లెపడుచు బట్టలుతుకుచు ఆయనను పిలిచినది.

ఒక హస్తమునకు గాజులుతొడిగి ముందుకువెళ్ళు అన్నది. ఆమెయొక్క దివ్యతేజస్సు, కన్నులప్రకాశము, మాటలమాధుర్యము వీటిని గమనించి, గాజులవాడు అచ్చటనే తనగంటును దింపి, ఒక హస్తమునకంతా పూర్తిగా గాజులు తొడిగినాడు. నా కింక చాలు, గ్రామములో ఫలాని వీధిలో నాతండ్రిగారిని అడిగి పైకము తీసుకో. అని ఆమె అన్నదాన్ని అతడు నమ్మినాడు ఒకవేళ నాతండ్రిగారు నాదగ్గర డబ్బులేదంటే ఆయనకుచెప్పు. పూజాగదిలో ఆయన పూజించే పటమునకు వెనక గోడకు గూడున్నది. దానిలో నాకియ్యవలసిన డబ్బున్నది అని.

ఆమె మాటలపై సంపూర్ణవిశ్వాసముతో అతడు ఆయింటికి పోతే, ఆ రాధారాధకుడు, కృష్ణభక్తుడు " ఇదేమి ఆశ్చర్యము! వింతగా నున్నదే? నాకు పెండ్లి కాలేదు. మరి కూతురెక్కడిది? గోడకు గూడు లేదు. ఎక్కడి గాజులు ఎక్కడి డబ్బు? " అని కంగారుపడితే గాజులవాడన్నాడు. " స్వామీ! మీరు పొరపడుతున్నారు. తప్పకవెళ్ళి చూడండి అని. ఆయన పరుగు పరుగునపోయి పటమువెనుక చూచితే గూడున్నది. డబ్బుకూడ అతనికివ్వవలసినదెంతో అంతమాత్ర మున్నది

ఆయన పరమానంద భరితుడై " ఆహా ; నారాధాదేవి నీకు ప్రత్యక్షమై నీచేత గాజులు తొడిగించుకొన్నదా! నువ్వెంత

ధన్యుడవు! రా! నదీ తీరమున నాకు ఆమె దర్శనభాగ్యము. తలవ్రాతలో మన్నదేమో" అని పరుగెత్తినాడు. సరస్వతీ నదీతీరమున నిలిచికొని ఆరాటపడుచూ, స్తోత్రము చేయుచూ, ప్రార్థించినపుడు నీటిపై నిండుగా గాజులు తొడిగిన ఆమె హస్తము మాత్రము దర్శనమిచ్చినది. నీ ముఖపద్మమును ఒక నిమిషము దర్శించే భాగ్యము నాకు లేదా, అంటే, ఆశరీరవాణి పలికినది. శ్రీకృష్ణునకు తప్ప అన్యులకు నాముఖము చూపను. అందరిలోను రాధాతత్త్వము అందరిలోను కృష్ణ తత్త్వము ఉన్నది. దానిని ఆరాధించితే ఫలితము లభించును.

జడమైన విగ్రహములు పటములు వీటికంటె సజీవ మానవులనే దైవముగా భావించి ఆరాధించండి. ద్వేషాసూయలు లేక సర్వులను ప్రేమించి సేవించండి. అందరిలోను శివుడున్నాడు. శివుడులేనివాడు శవమైపోతాడు కదా? కాబట్టి, దేవుడు ఏ అమరనాధములోనో. కాశీలోనో, భద్రాచలములోనో, తిరుపతిలోనో మాత్రమున్నాడనే భావమును పూర్తిగా తీసివేసి, అతడుసర్వవ్యాపి. సర్వాంతర్యామి, సర్వభూతాంతరాత్మ అని విశ్వసించి అందరినీ దైవభావముతోనే ఆదరించవలెను శివుడు సర్వవ్యాపకుడు అనే విశ్వాసము మీశ్వాసగా మారిపోవలెను ఆ శ్వాసనే స్వస్వరూపముగా సందర్శించుకొనవలెను

రాత్రి అంటే చీకటితో చేరినది. అయితే అజ్ఞానాంధకారమును దూరముచేసితే ఆ చీకటిలోనే ఆనందమునను భవించవచ్చును. దానిని బోధించేదే శివరాత్రియొక్క ఉద్దేశము.

మంగళకరమైన తన శివతత్త్వమును ప్రకటించుకొరకు ఒక సంవత్సరమంతా కాచుకొన నక్కరలేదు. చిత్తములోని వాంఛలను తీసివేసి, హృదయములోని ఆశలను అజ్ఞానమును పారద్రోలి దృష్టినుంచి కామ క్రోధాదులను నిర్మూలముచేసిన అదే శివరాత్రి. ప్రేమకు మించిన పరికరములేదు. నిత్యజీవితములోని ప్రతిపనినికూడ ప్రేమతో ఆచరించండి. భగవద్విశ్వాసమును పెంచుకొని అన్ని పనులను భగవదర్పితముగా. శక్తివంచనలేక భక్తివంచన కాకుండ సలుపండి.

జపముకాని. తపముకాని. యోగయాగములుకాని మీరు చేయనక్కరలేదు. నిరంతరము అందరిలోను మంచిమాటలు. మితభాష, మధురభాష. భగవన్నామస్మరణ యుండిన చాలు. పిల్లలు మొదలు పెద్దల వరకు ఈ మార్గమునను సరించిన జీవిత గమ్యమనే దైవానుగ్రహమునకు అందరునూ పాతులగుదురు.

బృందావనము 13-2-1972

శివరాత్రినాడు శ్రీవారనుగ్రహించిన దివ్యోపన్యాసము

కం॥ సాధకులను పలురీతుల
బాధించెడి మాయనీకు స్వాధీనమగున్
ఛేదించి మాయనిక, మా
సాధన సఫలంబొనర్పు సాయీరామా।

నేరెళ్ళ నారాయణమూర్తి.



# దయ గలిగిన హృదయము

భారతీయశాస్త్రములందలితత్త్వశాస్త్రములు అనేకత్వములోని ఏకత్వమునే బోధించుచున్నవి. దేనిని తెలిసికొన్న అన్నియు తెలియునో దానినే తెలుపుటకు ప్రయత్నించుచున్నవి. అన్ని టికీ ఆధారముగా ఒక సద్వస్తువు యుండవలెనని వెల్లడించు చున్నవి. "ఏకమేవాద్వితీయం" అనే పరమ సత్యమును ప్రతిపాదించు చున్నవి దానిని మనము దర్శించేందుకు సత్సం గము. సచ్చింతన. సత్ప్రవర్తన వీటినే అతిముఖ్యముగా శాస్త్ర గ్రంథములు చాటుచున్నవి.

సచ్చిదానందస్వరూపుడైన ఆ పరవస్తు సందర్శన భాగ్యము కొరకు శ్రుతిస్మృతులు నాలుగు మార్గముల నుపదేశించు చున్నవి. జ్ఞానమార్గము ( దీనినే సత్యసాయిబాబావారు 'సత్య నిష్ఠ' అని వక్కాణింతురు.) భక్తిమార్గము ('ప్రేమనిష్ఠ') కర్మ మార్గము ('ధర్మనిష్ఠ') యోగమార్గము ('శాంతినిష్ఠ') శ్రీవారు "సత్యధర్మశాంతిప్రేమలతో మీ నిత్యజీవనయాత్ర సాగించు" అని బోధించటములో ఈ నాలుగు మార్గముల సామరస్యము స్పష్టముగా కనబడుచున్నది.

చిత్తశుద్ధిని సంపాదించుకొని సచ్ఛీల సత్సంగములను అభ్యాసము చేసిన జ్ఞానజ్యోతి వెలుగునని దర్శన గ్రంథములు

ఉద్బోధించును. పాండిత్యమువలన యుక్తివాదమునభివృద్ధిపరచు కొని వాదవివాదములలో అగ్రగణ్యులుగా పేరు ప్రతిష్ఠలనుబొంద వచ్చును. బుద్ధికుశలతను ప్రదర్శించవచ్చును కాని ఏకత్వసంద ర్శనమైన జ్ఞానము యేనాటికీ లభించదు.

ఆనాటి జ్ఞానేశ్వర మహారాజ్‌వలె మనకు ఈనాడు యోగ సిద్ధులు ధర్మోద్ధారకులు జ్ఞానచింతామణి పరిపూర్ణానందస్వరూపులు భగవదవతారమూర్తియగు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు మన మధ్యనేయుండి తమ మహిమాతిశయముల వలన బోధామృతము వలన తమమునుంచి మనలను జ్ఞానజ్యోతికి ప్రవేశపెట్టుచున్నారు.

వారు దేనినైనానరే సృష్టించగలరు. ఈ విశ్వమంతా వారి సృష్టే! వారి శక్తికతీతమైనది యేదియూ లేదు. వారి శక్తిచే జరుగు అద్భుతములు, ప్రదర్శనములు కావు! అవి పరమాత్మ సర్వశక్తిమయుడు సర్వాంతర్యామి అనేదానికి నిద ర్శనములు. మానవబుద్ధికి అందని వారి మహిమలను చూచి. అనుభవించి ఆనందించి పులకితగాత్రులమై మనము వారిని మన హృదయపీఠమున ప్రతిష్ఠింపచేసికొనుటకు ఈ నిదర్శనములు సాయము చేయును.

దేహాత్మబుద్ధిని వదలి ప్రతిప్రాణిలోను వైశ్వానరుని రూపముతో వెలసియున్న పరమాత్మని దర్శించగలిగే సాధన లను శ్రీవారు అందరికీ మధురాతి మధురముగా ఉపదేశించు చున్నారు. వాటిననుసరించితే "సర్వం ఖల్విదంబ్రహ్మ" "అంతా

సాయిమయం ఈ జగమంతా బాబమయం" అనే అద్వైత దృష్టి లభించి తరించ వీలగును.

కాలికి ముల్లు గ్రుచ్చుకుంటె కంటినుండి నీరు కారుతుంది కదా! ఎందుకు? అంతా ఒకేజీవం ఏకాత్మభావన! అట్లనే సృష్టిలోని అన్నిపురములలోని పురుషులు ( దేహములోని దేహి ) ఆ పురుషోత్తముని అగాంగములే. లోకములో యేదేశములోనైనా యెక్కడైనా యెవరి కంటిమండైనా కష్టకాలములో ఒక్క కన్నీటిచుక్క రాలినచో ఏకత్వభావముగల ఇతరులెవ్వరును భిన్నముగా ఆనందముననుభవించ లేరు రాదు. అదే నిజమైన అద్వైతదృష్టి సంపాదన.

శ్రీవారు దీనినే బోధించుచున్నారు. దయగలిగిన హృదయమె దైవమందిరము. అత్యున్నతమైన భక్తిస్వరూపమె దయ. దీనదళితుల సేవయే అత్యంత ఫలకారియైన సాధన!

బొంబాయి

టి. ఎస్. భార్దె
స్పీకర్, మహారాష్ట్రవిధానసభ



# కళాశాల వార్షికోత్సవము

యుగాది :

16-3-72 పరీధావి నామసంవత్సరపు యుగాది పండుగకు. వేలాది భక్తులు ఆసేతు శీతాచలమునందున్న వివిధరాష్ట్రములనుండి దేశవిదేశములనుండికూడ ' బృందావనము 'నకు ఆగమించి శ్రీవారి దివ్యసన్నిధిలో ఆ పుణ్యపర్వదినమును ఆనందముగా గడిపిరి. ఉదయము భజన సందర్భమున. శ్రీవారు దర్శన భాగ్యమునందించి, అందరికీ మధురప్రసాదమును అనుగ్రహించిరి.

శంకుస్థాపన :

బృందావనములో తాత్కాలికముగా మూడు సంవత్సరములనుండి స్థాపితమైన శ్రీ సత్యసాయి ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజీకి. అదినము. అచ్చటనే. దానికానుకొనియున్న సువిశాలసైట్‌లో శంకుస్థాపన మహోత్సవమును మైసూరు రాష్ట్రపు రాజ్యపాల శ్రీ మోహన్‌లాల్ సుఖాడియాగారు సాయంత్రము 5 గంటలకు అత్యంత వైభవముగా జరిపిరి. శ్రీ సత్యసాయి యెడ్యుకేషన్ ఫౌండేషన్ సభ్యులు కాలేజీ కమిటీ సభ్యులు అధ్యాపకులు. వారికి ఘన స్వాగతము నొసగిరి. కాలేజీ N.C.C. దళమువారు గార్డ్ ఆఫ్ ఆనర్ గౌరవమునందించి తమ బ్యాండు గానముతో ఉత్సవమునకు మిక్కిలి శోభను చేకూర్చిరి తిరుపతి

క్షేత్రమున శ్రీవెంకటేశ్వర స్వామిని దర్శించుకొని ఆనాడు మధ్యాహ్నమునకే బెంగళూరు చేరిన గవర్నరుగారు శంకుస్థాపన సూచకముగా శిలాఫలకమును ఆవిష్కరణముచేసిరి. తరువాత బృందావనమును ప్రవేశించి శ్రీవారితో సంప్రదించుకొని అచ్చటనుండి సభాభవనమునకు శ్రీవారివెంట ఊరేగింపుగా బయలుదేరిరి.

సాయిగీత అనేగజరాణి సర్వాలంకారభూషితురాలై ముందు మందగతిని నడువగా శ్రీ సత్యసాయి వేదశాస్త్రపాఠశాల అధ్యాపకులు వేదఘోష గావించిరి. N.C.C. దళమువారు ఇరు ప్రక్కల వరుసగా నడచివచ్చిరి. వారి బ్యాండుయొక్క మ్రోత మిన్నుముట్టినది. కాడుగోడి గ్రామ పంచాయితీ సభ్యులు కాలేజీ కమిటీ సభ్యులు మొ॥ప్రముఖులు ఊరేగింపులో చేరుకొనిరి.

వార్షికోత్సవము :

యుగాది సమారంభముకాలేజీ శివవార్షికోత్సవము శంకుస్థాపన మహోత్సవము ఈ త్రివేణీ సంగమమువలన, వేలాదిభక్తుల సమూహము విద్యార్థిబృందము అమితానందముతో మహిొంగిరి.

డా॥ వినాయక్ కృష్ణ గోకాక్‌గారు అందరికీ సుస్వాగతము నందించిరి. మైసూరు రాష్ట్రముయొక్క నూతన రాజ్యపాల శ్రీ సుఖాడియాగారిని అభినందించుచూ, వారు వేసినది ఒక దివ్య భవ్య కట్టడమునకు పునాది మాత్రమేకాదు, ఒక దివ్య భవ్య విద్యా విధానమునకే. అని వెల్లడించిరి. శ్రీ సత్యసాయి యెడ్యుకేషన్ ఫౌండేషన్‌యొక్క ఆదర్శములను వివరించుచూ భారతదేశమున

ప్రతి రాష్ట్రములోను ఒక్క కాలేజీని స్థాపించి నడిపించవల యునని శ్రీవారాదేశించియున్నారని తెలిపిరి. ఆంధ్రప్రదేశమున అనంతపురములో 71 జూన్ నెలలో రాష్ట్రపతిగారు ప్రారంభో త్సవమున జరిపిన, 40 లక్షల రూపాయల ఖర్చుతో కట్టబడిన మహిళాకళాశాలనుదహరించి మైసూరు రాష్ట్రములోని ఈ కాలేజీ కట్టడముయొక్క ప్రథమ దశలో 20లక్షలు ఖర్చగునని చెప్పిరి. మధ్యప్రదేశము, (భోపాల్) తమిళనాడు, ఒరిస్సా మొదలగు రాష్ట్రములలో త్వరలోనే కాలేజీలు ప్రారంభమగునవిరి.

ఆయా యూనివర్సిటీల నియమానుసారముగ పాఠ్యక్రి మము, శిక్షణావిధానము పరీక్షలు అన్నియు జరిగినను, ఈ కాలే జీలో భారతీయసంస్కృతిని బోధించి, పోషించి అందరికిపీ అందు బాటులోనికి తేవటమునకు ప్రయత్నములు జరుగును. విద్యా ర్థినిలయములేవాటి కేంద్రస్థానములుగా నుండును. విద్యార్థులలో బహుభాగమువారు అక్కడనే నివసించి తమ వ్యాసంగమును శీలసంపాదనను అభివృద్ధి పరచుకొందురు. శ్రీవారి దివ్యసన్నిధి వారి కటాక్షవీక్షణము, వారి ఉపదేశామృతబిందువులు, వారందించు ఆశీస్సులు, వారు అనుగ్రహించు ఉత్సాహము, దైహిక మానసికబల ములు, శక్తిసామర్థ్యములు ఇవి ఈ కాలేజీల మూలధనము" అనిరి.

ఇప్పటి విద్యావిధానములో విద్యార్థులకు ముఖ్యలాభమైన డిగ్రీలను 'భిక్షాపాత్రలు' అని శ్రీవారు గుర్తించినవాన్ని ఉద హరించుచూ, డా॥ గోకాక్‌గారు, 'జీతముకొరకు అభ్యసించుచున్న పాఠ్యక్రమములకు అంత లక్ష్యమునందించక, జీవితముకొరకు-

సుఖశాంతులకొరకు. ధైర్య స్థయిర్యములకొరకు. విద్యవఠ్యసింప వలెను" అని శ్రీవారిదివ్యసందేశమును నొక్కి చెప్పిరి. "బుట్టలో సమాచారములను నింపుకొనేదికాదు ప్రధాన ఫలితం: మనో బుద్ధులచే జరుపు ఆచారమే ముఖ్యము" అనిరి. సహనము, సేవాసక్తి విశాల విశ్వప్రేమ, భూతదయ వీటిని పెంచి పోషించేదే, ఈకాలేజీల గురి అనిరి. దీనికంతా శ్రీవారే మనకు మార్గదర్శకులు. మనకందరికీ వారే సద్గురువులు అని శ్రీవారి గుణగణములను విశదీకరించిరి. శ్రీవారి ఆధ్వర్యమున స్థాపింపబడిన కాలేజీలలో ధర్మప్రబోధ. భారతీయసంస్కృతియొక్క మూలాధారమైన గీతోపనిషత్తులగురించి ఉపన్యాసములు. భజనలు యోగాభ్యాసము, ధ్యానశిక్షణము నామసంకీర్తనము నామస్మరణము మొదలగు కార్యక్రమములు సేవాకార్యక్రమములు అవిచ్ఛిన్నముగా జరుగునవిరి. దీనివలన వేరుకాలేజీలలో అపుడపుడు. జరిగేఅల్లర్లూ. అవిధేయతలు విద్యాగురువులపై విద్యామందిరములపై దాడులుఇట్టివి ఈకాలేజీలలో యెక్కడను యేనాడూ జరుగలేదని జరుగదని వారు చెప్పిరి.

విద్యార్థుల అనుభవము :

తరువాత. కాలేజీలో బి. కాం. చదువుచున్న శ్రీ సతీశ చంద్ర అనే విద్యార్థి తన కాలేజీ అనుభవములను చక్కగా వివరించి తన విద్యామాతయైన సంస్థయొక్క విశిష్టతను కొనియాడినాడు. "మేము ఒక B.A. డిగ్రీకోసముకాదు. శిక్షణ పొందుచున్నది B. A. B. A. అనే దేదీప్యమానమైన దివ్య

పదవిని పొందుటకే మా విద్యాసాధన " మరియు ( B. Being -సత్) (A Awareness-చిత్) (B. Bliss-ఆనందము) (A. Atma-ఆత్మ) మేమందరము సచ్చిదానందస్వరూపమైన ఆత్మసాక్షాత్కారము వలన దొరకే నిత్యానందమును సంపాదించుటకే పూనుకొన్నాము. " అనిచెప్పి మాకు అల్లరులతో అసత్య. అన్యాయ, అక్రమ అనాచారములతో పనిలేదు, కెమిష్ట్రీకాని ఫిజిక్స్‌కాని యేదోకొన్ని పాంచభౌతికమైన విషయములనుమాత్రమే తెలుపునుకాని మాధవత్వమునుపొందే ప్రయత్నములో సహాయ సహకారముల నందించవు. సాక్షాత్ భగవత్ స్వరూపులైన బాబావారి సహవాస భాగ్యము, వారి సంభాషణా శ్రవణభాగ్యము, వారి అద్భుతచర్యలను అవలోకించే అవకాశము, ఇవి మాకు యిచ్చట దొరకే అమూల్య శిక్షణలు. దీనికంటె మాకు యేమి కావాలి? ఇతర సంస్థలలో యే విద్యార్థికీ అబ్బని మహాభాగ్యమిది. మాలో యెంతోమంది పరీక్షలలో ఓడిపోతే మరొక సంవత్సరము యిచ్చటనేయుండి వారి నీడలో వారి కృపాశ్రయములో వారి వాత్సల్యపూరిత పర్యవేక్షణలో చదువవచ్చుననే ఆశతోకూడ నుంటారు. అయితే వారి సంకల్పమెట్టిదో అటులే జరుగునుకాని. మా ఊహలకేమి విలువ? అని చెప్పినాడు.

ప్రతి గురువారం విద్యార్థులకు సత్య ధర్మ, శాంతి, ప్రేమలగురించి వాటి ఆచరణగురించి డా॥ గోకాక్‌గారు మొదలగు విద్వచ్ఛిరోమణులు ఉపన్యసింతురని యు. భజనలు హృద

యపూర్వకముగా నలిపి ఆనందించుచుందుమనియు. తెలిపినాడు. ఇతర కాలేజీలలో పిల్లల భవిష్యత్తు విషయమై తగు సలహాల నందించుటకై Counsellor అనే ప్రత్యేక అధికారులను నియమించియున్నారని తెలిపి మాకాలేజీలో ఉపాధ్యాయులందరు మా హితైషులుగా సలహాదారులుగా ఆత్మబంధువులవలె మెలగుచున్నారని మా భాగ్యమునుచూచి దేవతలే అసూయపడుదురని అన్నాడు.

కాలేజీ ప్రిన్సిపాల్‌గారు రిపోర్టుచదివి సభకర్పించిరి. విద్యార్థుల శ్రద్ధాభక్తులతో పాఠ్యప్రవచనములలోను ఆటపాటలలోను పాల్గొని సంస్థకు మంచి కీర్తిని సంపాందించుచున్నారనిరి. కర్నల్ జోగారావుగారు శంకుస్థాపన సమయమున స్వయంప్రేరితముగా విరాళములనందించిన సద్గృహస్థుల కొన్ని పేర్లను సభకు తెలిపిరి. ఆ దినమే కొన్ని లక్షలకుపైగా ధనము కాలేజీ కట్టడము కొరకు అనపేక్షముగా సంగ్రహమైనదని తెలిపిరి. కొంతమంది విద్యాపోషకులు కాలేజీలలోని విద్యార్థులకు స్కాలర్‌షిప్పుల నందించేకొరకు విరాళములను వాగ్దానముచేసిరి.

శ్రీవారి సంకల్పము :

తరువాత ముఖ్య అతిధిగా అగమించి శంకుస్థాపన జర్పి అధ్యక్షత వహించి అందరినీ ఆనందపరచిన జనప్రియ రాజ్యపాల శ్రీ సుఖాడియాగారు ఉపన్యసించిరి. "శ్రీవారి ఆధ్వర్యమున నడిపించే ఈ కాలేజీ ఆధునిక భారతమునకేగాక ఆధునిక జగత్తుకే అత్యవసరమైన శిక్షణక్రమమునందించు చున్నది"

అనిరి. మానవుని అంతరంగమున దాగియున్న దివ్యత్వమును ప్రకటింపజేసేది విద్యావిధానముయొక్క యేకైక లక్ష్యము. దానిని మీరు యిచ్చట సుస్పష్టముగా కనుగొని ఆచరణలోనికి తెచ్చి రాజ్యమునకు మహోపకారము నొనంగుచున్నారని అన్నారు. దైహిక బౌద్ధిక మానసిక క్షేత్రములు మూడింటిలోను విద్యా భ్యాసమువలన మానవుడు పురోగమించవలెను. ఈ కాలేజీలో ఈమూడు క్షేత్రములలోను అత్యుత్తమ కృషి జరుగుచున్నది, కావట్టి నేను ఈ దినము పునాదివేసినది కేవలము ఒక సౌధ మునకు కాదు; ఒక వినూతన విద్యాకార్యక్రమమునకే అని నేను చాల సంతోషించుచున్నాను అనిరి.

సరళ సుందరమైన ప్రశాంత గ్రామీణ వాతావరణములోనే ఈ కాలేజీలను శ్రీవారు స్థాపించియున్నారు. ఇది గమనార్హ విశిష్టత ఇచట ధర్మబోధన అనుక్షణము జరుగుచున్నది. భారతదేశ ప్రభుత్వమును "సెక్యులర్" అని రాజ్యాంగములో గుర్తించటమైనది.

సెక్యులర్ అనిన ధర్మరహితమని మతరహితమని కాదు. అన్ని ధర్మ పద్ధతులకు మతసాంప్రదాయములకు మూలభూతమైన సత్యం జ్ఞానం భక్తి సత్కర్మలు వీటిని పురస్కరించుకొని, సహన భావముతో సామరస్యముతో ద్వేషాసూయలు లేక అందరితోను భ్రాతృభావముతో మెలగవలెను. అనేదే అర్థము. అందరిలోను వెలు గుచున్న భగవచ్ఛక్తిని ఆదరించి యెవరినీ బాధపెట్టక జీవిత మును సాగించు విధానమే సెక్యులరిజం. అన్నిటియందు సుప్త

చేతనముగా ప్రకాశించు భగవచ్ఛక్తిని ఆరాధించి విశ్వమంతా విశ్వేశ్వరుని లీలాక్షేత్రమని సంతసించి సంతృప్తిగానుండుటయే పెళ్ళులరిజం'' అన్నారు. శ్రీవారి సద్బోధనల ననుసరించి జీవిత పథమును తీర్చి దిద్దుకొనుటయే దివ్యమార్గమనిరి. ధర్మ సూక్ష్మములను వారినుంచి తెలిసికొని శిక్షణను పొందినచో యువక జనబృందములో చెలరేగుచున్న ఉద్రేకపరిస్థితులు మార్పుచెందును. సమాజమున సుఖశాంతులు స్థిరమగును అనిరి. వేదవిహిత మైన గాయత్రిమంత్రముతో భగవంతుని భారతీయులు ప్రార్థించునది భోగభాగ్యముల కొరకు కాదు. ఆస్తిపాస్తులకొరకు కాదు పేరుప్రతిష్ఠల కొరకు కాదు. ధీశక్తియొక్క ప్రబోధన బుద్ధి యొక్క వికాసము జ్ఞానజ్యోతియొక్క వెలుగు అందించుటకొరకే. కాలేజీయొక్క వార్షికోత్సవమునాడు విద్యార్థులందరు ఈ ఆద ర్శములను సాధింప పూనుకొనవలసినది. అని మిమ్ములను నేను హెచ్చరించుచున్నాను. '' అనిరి.

దివ్యోపన్యాసము :

శ్రీవారు తమ దివ్యోపన్యాసము నందించుచూ '' ప్రవ ర్తన శీలురైన భారతీయులు యిటీవల జడ భావమును ధరించి తమలోని దివ్యత్వమును గుర్తించక తికమకలాడుచున్నారు. పాశ్చా త్యభావనా పరిభావమువలన తమ ప్రాచీన ఆర్షసంస్కృతిని తిర స్కరించి. సనాతనమైన దైవభావమును విశ్వసించలేని హృద యములకు గౌరవస్థానము నందించుచున్నారు. అదెకు తెచ్చిన యిట్టి చెడుభావములు దిగుమతిచేసిన పిచ్చిపిచ్చి భ్రాంతులు

మానవుని దివ్యాకారమును వికారము చేయును. అవర్థ మునకే దారితీయును. మానసిక వికాసమువలననే మానవుని శక్తిసామర్థ్యములు సంపూర్ణముగా ప్రకటితమగును. విద్యావిష యమటుంచిన ఇట్టివికారచర్యలద్వారా తల్లిదండ్రుల కంకీర్తిని గడించుటేగాక దేశముయొక్క ప్రతిష్ఠకే మసి పూసినట్లగును అశాంతి, అన్యాయ, అక్రమ, అసత్యములను అగ్ని జ్వాలలే పెరుగును. ఇట్టిమారకాస్త్రములకు పరిహారమేది అనునది ఇప్పటి ప్రజలకు తెలియదు. ప్రభుత్వమునకు అందదు. కాబట్టి ప్రా కృతస్వరూపభావములే అభివృద్ధియగుచున్నవి.

సర్వభూతాంతరాత్మ :

దీనికి మానవుని నిజతత్త్వమైన భగవత్తత్త్వమే ప్రకా శము కావలెను. త్యాగము, సత్యము, సహనము. సామర స్యము....వీటిని వ్యక్తిలోను సమాజములోను పోషించి పెంచ వలయును. ఆత్మశక్తిని ప్రకటింపజేసే దివ్యమార్గమే విద్యా విధానము. భారతదేశముయొక్క శాశ్వతకీర్తిని నిలబెట్టి ప్రపం చమునకు సత్య ధర్మ శాంతి ప్రేమలను అందించే కర్తవ్యము ఈ తరమువారిది, ఇట్టి విద్యాసంస్థలది. అదే విద్యాప్రబోధకుల విద్యార్థుల కర్తవ్యము " అనిరి.

యుగములు :

యుగాది పండుగ అనే మాటకు కొత్తయుగము ప్రారం భమయ్యే దినము అని అర్థము. యుగమునకు ఈదినము ఆది

మొదటి దినము అని. ఇన్ని సంవత్సరములు ఒకయుగము. సంవత్సరమునకొక యుగాది అనేది రాజకృత నియమము కావచ్చును. సామాజిక సాంప్రదాయము కావచ్చును. అయితే, యుగములమార్పు, ధర్మాచరణ, ధర్మమార్గావలంబనమునుబట్టి నిర్ణయమగును. దానికి రాజశాసనములు అక్కరలేదు. సుషుప్తి స్థానములో తమస్సుచే ఆవృతమై అజ్ఞానముతో జడప్రకృతిలో పడియున్న కాలమునకంతా '' కలియుగము '' అనబడును. సుషుప్తినుంచి జాగ్రదవస్థకు వచ్చినపుడు మనోస్థానమందు వాంఛ బజన్మించి యింద్రియములు మేల్కొని సంకల్పములు పుట్టినపుడు ' ద్వాపరయుగ ' మనబడును. ఆ మనోభీష్టముల నిర్వర్తించే కొరకు కార్యాచరణ చేయుకాలమునకు ' త్రేతాయుగ ' మనిపేరు. దానివలన కలుగు ఆనందమును ఆరగించే సమయమే ' కృతయుగము ' కాబట్టి ఆచరణ విచారణములే యుగ మార్పులకు మూలకారణముకాని రాజశాసనము కాదు. ఒక్కొక్క వ్యక్తిలోను ఈ నాలుగు యుగములు వేరువేరు కాలప్రమాణములలో జరుగును. మానసిక పరిస్థితిలోని నాలుగు పరిణామములే యుగములు. సాధనసాయముతో ఒక యుగమునుంచి మరొకదానికి మనస్సును తీర్చిదిద్ది గొనిపోవలయును. కృతయుగమునుంచి కలియుగమునకు దిగజారకూడదు. కలినుంచి కృతయుగమునకు అభివృద్ధి కావలెను. అదే మానవత్వమునుంచి దైవత్వమునకు మీరు చేయవలసిన జీవిత తీర్థయాత్ర.

(సశేషం)

# అనుగ్రహ ధనము

భగవంతుని దృష్టిలో అందరు సమానమే. బీదసాదలనే భేదభావములు సాయిరామునకు లేవు. మన సాధనను బట్టే సాక్షాత్కారము. కర్షకుడు పొలములో విత్తులు నాటినంతనే ఫలసాయమును పొందుటలేదు కదా! రాత్రింబగళ్ళు శ్రమించి కృషిచేసిన పిమ్మటనే కదా ఫలసాయమును చక్కగా అనుభవించి సుఖించుచున్నాడు. అటులనే సాయిరాముని ఫోటో మనము గోడకు తగిలించినంతమాత్రముననే మన అభీష్టసిద్ధి నెరవేరదు. దానికి తగినంత సాధన చేయాలి. విషయ సుఖములనాశించి, బాహ్యలోకములో విహరించుచున్న యింద్రియములను అరికట్టే సాహసములేని మనకు సాయి నటరాజేశ్వరస్వామి సాక్షాత్కారము దుర్లభము.

మనలోని అహమును చంపుకొని మన తోటిమానవుని ఏహ్యించుకొనక మనమందరము సాయి ఫామిలీవారమని భావించవలెను. సాయిరాముని పూజించుటకు అందరూ అర్హులేనని భావించి చిన్న పెద్ద అన్న భేదాభిప్రాయములు మాని భక్తులందరుకూడి భజనలు చేయాలి. భక్తితో మన సాయిరాముని భజించుటే ప్రధానముకాని లేనిపోని ఈర్ష్యలకు తావీయకూడదు. పదవులకొరకు ప్రాకులాడక సాయికార్యక్రమములో పాల్గొనవలెను

వచ్చునప్పుడు డెలిగేట్సుగను వాలంటీర్లగను నేను నేనని నాకు బాడ్జీలు కావాలని పోట్లాడుట అవివేకము మనమందరము సాయి సుందరుని హృదయమునకు బాడ్జీలుగా తగల్చబడుటకు తగిన కృషి చేయాలి. మనలలోని కొంతమంది భక్తులు పూల మాలలు తగ్గిన పూజ తగ్గిపోవునని భావింతురు. ఇది వివేకము లేని వాళ్ళకు కలిగే విచారము. పేరు ప్రతిష్ఠలు మన కనవసరము పవిత కొరకు ఆడంబర విధానమును ఆడంబర ప్రచారములను పాటించుట తగదు. సాయి భగవానుని దగ్గరచేరి ఆదివ్యపురుషుని అమృతవాక్కులను ఆచరణలో పెట్టి ఆయన అనుగ్రహ ధనము కొరకు ప్రార్థించేది ఉత్తమ మార్గము.

ఆ దివ్య సుందర అవతార మంగళమూర్తిని చూచుటకు ఎన్నోవేల నేత్రములు కావలయును. కన్నుల కఱవుతీర ఆ మనోహర దివ్యమూర్తిని దర్శించిన భక్తమహా జనులకు మరి యొక జన్మ యెక్కడిది? మానవరూపములోనున్న సాయిమహేశ్వరుని గుర్తించువారు చాల తక్కువమంది మాత్రమే! వికసించిన తామరపుష్పానికి అతిసమీపములోనున్నప్పటికిని ఆపుష్పాంతర్గతమగు మకరందాన్ని కప్పలు అస్వాదించజాలక ప్రక్కలబడియున్న పురుగులను క్రిమి కీటకాదులను తింటూ బురదలోనే పడియుండును. కాని దూరదూరమునుండి పరుగున ఝుంకారము చేస్తూ తుమ్మెదలు వచ్చి పద్మములోనున్న మకరందాన్ని త్రాగి మహానందమును పొంది సుఖించును గదా! అటులనే మానవ రూపములో ప్రకాశించుచున్న సాయిమహేశ్వర దివ్యమంగళ అవ

తారమును భారతీయ మహాజనులు గుర్తించి, గ్రహించి, వివు తించి, చింతించి, ధ్యానించి పునీతులగుదురు గాక ! ఆ దివ్య మంగళరూపదర్శనము సర్వపాప హరము. ఆ కమనీయ దివ్య నేత్రాలనుండి జాలువారే ప్రేమామృత ధారలు మానవ హృదయ క్షేత్రాలలోని సర్వ విషయవాసనా మాలిన్యాలను క్షాళణముచేను గలవు చిరునవ్వులతో చిందులాడే ఆ వదనాంబుజ కాంతులు సమస్త కర్మబంధాలను అజ్ఞాన తిమిరాలను నాశనము చేయగలవు. ఆ చల్లని మాతృవీక్షణము నిరాశాహృదయాలకు మాతనోత్సా హామును కలిగించును. ప్రశాంతి నిలయములో ప్రేమావతారు నిగా అవతరించిన సాయి గంగాధరుని దర్శించి ఆయన వచనా మృత ధారలను గ్రోలి భక్తమహాజనులు పునీతులగుదురు గాక!

గంటి. వెంకటేశ్వరులు.

## శ్రీసత్యసాయి సత్సంగ సమాచారములు

ఫిబ్రవరి 6 : బీదర్ నగరము : (మైసూరు) ; సమితి : ప్రారం భోత్సవము.

13 : మహాశివరాత్రి మహోత్సవము : శ్రీవారిసన్ని ధిలో వైట్ఫీల్డు 'బృందావనం' లో జరిగినది. ప్రపంచ వ్యాప కముగా అంగ సంస్థలు అఖండ భజన ఆచరించినవి.

20 ; మితాపురం : (గుజరాత్) ; భజన మండలి : 2వ వార్షికోత్సవము : శ్రీ ఇందూలాల్ షా

: ఉడమలైపేట ; తమిళనాడు : సమితి : 4 వవార్షికోత్సవము.

21-4 : కేరళ ; శ్రీమతి ఇందిరాదేవిగారు (మెక్సికో) ఎర్నాకులం: మహిళావిభాగ్, క్యాలికట్ మహిళావిభాగ్ వార్షికోత్సవములలో పాల్గొని ఆలప్పి, కొల్లం, పాల్ఘాట్ పట్టణములలో ఉపన్యసించిరి.

26-27; రాజమండ్రి : (తూ॥గో॥జిల్లా) : సమితి ; జిల్లా కార్యకర్తల సమావేశము.

27 ; చింద్వారా : (మధ్యప్రదేశ్) : సమితి : జిల్లా కారాగృహములో భజన కార్యక్రమము.

పాండిచేరి : (సమితి) : సాధనాక్యాంపు.

28 పెదపాడు (ప॥గో॥జిల్లా) : మైసూరు సుబ్రహ్మణ్య స్వామి దేవాలయమున భజన కార్యక్రమము :

: కూచిమంచివారి అగ్రహారము ; (తూ॥గో॥జిల్లా) 2 వ వార్షికోత్సవము.

మార్చి: 5 విమానకాలొని బొంబాయి ; భజనమండలి. 5వ వార్షికోత్సవము.

మార్చి 12: కన్ననూరు : సమితి: జిల్లాకార్యకర్తలసమ్మేళనము.

16 : యుగాది : శ్రీసత్యసాయి కాలేజి నూతన సౌధమునకు శంకుస్థాపన కాలేజీ మహోత్సవము బెంగళూరు.

# పుస్తక సూచి

1 పుస్తకముల వెలయు పోస్టు మరియు రిజిస్ట్రేషను ఛార్జీలను మని యార్డరుద్వారా మాకు పంపించిన తరువాత మాత్రమే మీకు పుస్తకముల పంపించగలము.

2 విలువలోనున్న పుస్తకముల వాటి పోస్టు ఛార్జీల క్రింద తెలియ జేయబడినవి. పుస్తకములు రిజిష్టర్డు బుక్‌పోస్టులో మాత్రమే పంపబడును. మీకు కావలసినపుస్తకముల వెలయు పోస్టుచార్జీ మరియు ప్రతి ఆర్డరుతోను రిజిస్ట్రేషను ఛార్జీ రూ. 1-05పై జతపరచి, కావలసిన పుస్తకములను వివరముగా వ్రాసి పంపవలెను.

| | పేరు | వెల | టపాలచార్జీ |
|---|---|---|---|
| **తెలుగు:-** | | | |
| 1. | సత్యంశివం సుందరం (1) | 4-00 | 0-40 |
| 2. | .. .. (2) | 4-00 | 0-45 |
| 3. | మణిమాల | 1-00 | 0-15 |
| 4. | భాగవత వాహిని | 4-00 | 0-25 |
| 5. | అర్పణ | 1-00 | 0-10 |
| 6. | సాయిరామ నామమహిమ | 1-00 | 0-10 |
| 7. | సందేహ నివారిణి | 1-50 | 0-20 |
| 8. | గీతా వాహిని | 4-00 | 0-40 |
| 9. | వచనామృతము | 4-00 | 0-30 |
| 10. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 11. | సాయిరాముడెవరు | 1-00 | 0-10 |
| 12. | బోధామృతము | 0-50 | 0-10 |
| 13. | సాయిమహిమ | 1-00 | 0-20 |

| | | |
|---|---|---|
| 14. భజనావళి | 1-00 | 0-20 |
| 15. దివ్యోపన్యాసములు | 1-50 | 0-15 |
| 16. స్తుతి తరంగిణి (2వ భా) | 0-50 | 0-10 |

కన్నడం: —

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం | 3-50 | 0-30 |
| 2. జ్ఞాన వాహిని | 1-50 | 0-10 |
| 3. ప్రశాంతి వాహిని | 1-50 | 0-10 |
| 4. సందేహ నివారిణి | 1-50 | 0-10 |
| 5. ధర్మ వాహిని | 1-50 | 0-10 |
| 6. ఉపనిషత్ వాహిని | 1-50 | 0-10 |
| 7. ధ్యాన వాహిని | 1-50 | 0-10 |
| 8. ప్రశ్నోత్తర వాహిని | 1-00 | 0-15 |
| 9. గీతావాహిని | 4-00 | 0-25 |

మలయాళము:—

| | | |
|---|---|---|
| 1. సత్యం శివం సుందరం (2) | 4-00 | 0-40 |
| 2. 108 రత్నంగళ్ | 1-50 | 0-10 |
| 3. గీతావాహిని | 3-00 | 0-15 |
| 4. వచోరత్నంగళ్ (1) | 2-00 | 0-20 |
| 5. ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 6. అవతార మధురవాక్య | 2-00 | 0-20 |
| 7. డివైన్ వాలి టు ది స్టూడెంట్సు | 1-00 | 0-15 |
| 8. ధర్మ వాహిని | 1-00 | 0-10 |
| 9. జ్ఞానోపదేశ రత్నంగళ్ | 1-50 | 0-25 |

ఇంగ్లీషు:

| | | |
|---|---|---|
| 1. సత్యసాయి స్పీక్స్ (1భా) | 4-00 | 0-25 |

| | | | |
|---|---|---|---|
| 2. | సత్యసాయి స్పీక్స్ (2భా) | 4-00 | 0 30 |
| 3. | .. .. (3భా) | 4-00 | 0-30 |
| 4. | .. .. (4భా) | 5-00 | 0-40 |
| 5. | .. .. (5భా) | 5-00 | 0-40 |
| 6. | .. .. (6భా) | 5-00 | 0-40 |
| 7. | .. (7భా) | 7-00 | 0-65 |
| 8. | పెలర్టెడ్ జ్యూయల్స్ (పద్యములు) | 1-50 | 0-10 |
| | సాయిబాబా [అమెరికన్ ఎడిషన్ సత్యం శివం సుందరం (1)] | 6-00 | 0-40 |
| 10. | ప్రశాంతి వాహిని | 2-00 | 0-15 |
| 11. | ప్రేమ వాహిని | 2-00 | 0-15 |
| 12. | ఉపనిషత్ వాహిని | 2-00 | 0-15 |
| 13. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 14. | గీతా వాహిని | 4-00 | 0-35 |
| 15. | జ్ఞాన వాహిని | 2-00 | 0-15 |
| 16. | భాగవతవాహిని | 5-00 | 0-40 |
| 1 | భజన్ సాంగ్స్ | 2-00 | 0-20 |

అరవం:——

| | | | |
|---|---|---|---|
| 1. | భగవాన్ శ్రీ సత్యసాయిబాబా అరుళ్వాక్కు | 2-00 | 0-15 |
| 2. | అన్బిన్ జ్యోతి | 2-00 | 0-20 |
| 3. | సత్యం శివం సుందరం (1వ భా) | 3-50 | 0-40 |
| 4. | .. .. .. (2వ భా) | 4-00 | 0-30 |
| 5. | భజనావళి | 1-00 | 0-15 |
| 6. | అవతారమొళిఅముదం (1వ భా) | 3-00 | 0-30 |
| 7. | ,, ,, (2వ భా) | 3-00 | 0-35 |
| 8. | సాయిమాత | 1-00 | 0-10 |

| | | | |
|---|---|---|---|
| 9. | ధర్మ వాహిని | 1-50 | 0-15 |
| 10. | సందేహనివారిణి | 2-00 | 0-25 |

హిందీ:——

| | | | |
|---|---|---|---|
| 1. | సత్యసాయీశ్వరాయనమః (పద్యములు) | 1-00 | 0-10 |

బెంగాలి:——

| | | | |
|---|---|---|---|
| 1. | ధ్యానవాహిని | 1-75 | 0-10 |

గుజరాతి:——

| | | | |
|---|---|---|---|
| 1. | అమృత్ వాహిని | 2-00 | 0-20 |
| 2. | కథాసుధ | 2-00 | 0-15 |

సింధి:—

| | | | |
|---|---|---|---|
| 1. | భజనావళి | 0-50 | 0-10 |
| 2. | ధ్యానవాహిని | 1-00 | 0-15 |
| 3. | ప్రశాంతివాహిని | 1-50 | 0-10 |
| 4. | సత్యం శివం సుందరం (1వ భా) | 4-00 | 0.40 |
| 5. | .. .. (2వ భా) | 4-00 | 0-40 |

మేనేజర్, సనాతన సారథి



## గమనిక . పత్రికల చందాలు, పుస్తకముల ఆర్డర్లు

1. ప్రశాంతినిలయమునుండి తెలుగు మరియు ఇంగ్లీషు భాషలలో మాత్రమే సనాతన సారథి మాసపత్రిక ప్రచురింపబడుచున్నది.

2. చందాలను పంపించునప్పుడు ఈక్రిందివివరములను సుస్పష్టముగా తెల్పవలెను

ఎ) మొదటిసారిగా చందాలు పంపేవారు "క్రొత్తచందాదారు" అని వ్రాయవలెను.

బి) ప్రస్తుతచందా గడువు పొడిగించుటకు, తన చందానెంబరును చందాపంపించు సమయముననే తెలియచేయవలెను.

సి) తెలుగుపత్రిక కావలెనో, లేక ఇంగ్లీషుపత్రిక కావలెనో స్పష్టముగావ్రాయవలెను.

డి) చందాదారు తన పేరును పూర్తి విలాసమును స్పష్టముగా తెలియునట్లు వ్రాయవలెను M.O. ద్వారాచందాను పంపించువారు వారిపేరును, పూర్తి విలాసమును M.O. కూపను వెనుకభాగమున వ్రాయుట అత్యావశ్యకము.

3. పత్రికలుగాని, పుస్తకములుకాని V.P.P. ద్వారా పంపబడవు. పుస్తకములు కావలసినవారు, వాటివివరములను పైకముతోపాటుగా తెలియపరచవలెను. (M.O. ద్వారా పైకముపంపునెడల కూపనులోనే కావలసినపుస్తకముల వివరములను తెల్పవలెను)

4. పత్రికకుగాని పుస్తకములకుగాని పైకమును పంపించువారు తమచెక్కులను డ్రాఫ్టులను, పోస్టల్ ఆర్డర్లను, మనియార్డర్లను, "సనాతనసారథి", ప్రశాంతినిలయం పోస్టు అనంతపురంజిల్లా, ఆంధ్రప్రదేశ్" అను చిరునామాకు పంపవలెను చెక్కులు పంపేవారు బ్యాంకి ఖర్చులనుకూడ కలిపి మొత్తమును పంపవలెను. పత్రికగాని, లేక పుస్తకములుగాని, చెక్కుపైకము వసూలైన తరువాతనే పంపించబడును.

5. పైవిషయములకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరములను "మేనేజరు, సనాతన సారథి, ప్రశాంతినిలయంపోస్టు, అనంతపురంజిల్లా. ఆంధ్రప్రదేశ్ అనుచిరునామాకు వ్రాయవలెను అట్లువ్రాయు ఉత్తరప్రత్యుత్తరములలో తమచందానెంబరును లేక బుక్ ఆర్డరునెంబరును, తప్పక వ్రాయవలెను, అట్లు వ్రాయనియెడల జవాబులిచ్చుటకు ఆలస్యమగును.

6. పోస్టుద్వారా ఫొటోలు పంపబడవు.

---

ఆంధ్రప్రదేశ్ అనంతపురం జిల్లా ప్రశాంతినిలయమునందలి శ్రీ సత్యసాయి ముద్రణాలయమందు యన్. కస్తూరి గారిచే ముద్రింపబడి, బి. వి. రాజారెడ్డిగారిచే శ్రీ సత్యసాయిట్రస్ట్ తరపున ప్రచురించబడినది. ఎడిటర్, యన్. కస్తూరి ఎం. ఏ. బి. యల్.

